Regd. No. M 3554 VEENA

# మధుకణములు

శ్రీ పాటిబండ మాధవశర్మగారి

ఖండ కృతుల సంపుటి

అచ్చులో ఉన్నది

ఫెదర్వెయిట్ పేపర్ మీద

ముచ్చటయిన ముద్రణ

వీణ కార్యాలయంలో

దొరుకుతవి.

Edited, Printed and Published by
Patibanda Madhava Sarma, M. A. (Hons)
at the Usha Press, Telaprolu P. O. Kistna Dist.

# ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము

ప్రథమసంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౬౦౦ పుటలు గలవు. ఇందు 'అ' నుండి 'అథ్వర్య' వరకునుగల విషయములుగలదు. త్రివర్ణ పటములు ౭, ఇతర పటములు ౧౨౫, వివిధవిషయములు ౮౦౧ కలవు.

రెండవసంపుటమునందు డిమ్మీ ౮-వ ఆకృతియందు ౬౧౦ లకు మించిన పుటలు కలవు. 'అన్' మొదలు 'అశ్విని' వరకుగల విషయము గలదు. త్రివర్ణపటములు ౧౦, ఇతర పటములు ౨౫౦ కి పైగా. వివిధ విషయములు ౮౦౦ వరకు నుండును.

ప్రతి సంపుటము చక్కని స్వదేశీ చర్మముతోడను బంగారు రేఖలతోడను సంపుటీకృతము. సంపుటము ౧ కి రూ. ౧౦.

ప్రవేశ రుసుము రూ. ౧.

పోస్టు-రైలు ఖర్చులు ప్రత్యేకము. అడ్వాన్సు రూ. ౫ పంపవలెను. మూడవసంపుటము ముద్రణమున నున్నది.

పండిత సాహాయ్యమునను, అపారసాధనసంపదల మూలమునను సాధ్యము గాదగిన ఈ కార్యమును తలపెట్టుట సాహసమును, అనాలోచితమును ఐనను ఆంధ్రమహాజనుల సాహాయ్యమున ని ప్రయత్నము సఫలముగాగలదని నమ్ముచు యథాశక్తిని సహాయ్యము చేయుటకు వేడుచున్నాము.

మేనేజరు
ఆంధ్ర విజ్ఞానసర్వస్వ కార్యాలయము
నెం 7, తంబుశెట్టి వీధి, మదరాసు.

ఈ ప్రకటన వీణలో చూసెనామని చెప్పండి

నైశ్చల్యం, సౌందర్యం పుంజీభవించాయి. వేపిన శనగలు నైవేద్యం పెట్టింది. వెంకట్రావు ముత్తైదువులను చూసి, శ్రావణమంగళవారం తల్చుకుని, ప్రేయసిని తల్చుకుని వియోగార్తి చే పొగిలిపోతున్నాడు.

*　　*　　*　　*

ఆలయ ప్రాంగణపు జయగంటలతన్ని శోకంకూప్మంలోనుంచి లేపాయి. లేచి మొగము నీళ్లతో కడుక్కున్నాడు. పాదప్రక్షాళనం చేశాడు. దేవాలయంలోనికి పోయి ప్రదక్షిణం చేసి విభూతి మొగాన్ని పెట్టుకొని శివానందలహరి, ముకుందమాలలోని శ్లోకాలు, పఠిస్తూ లోలోని ప్రియవియోగమననాన్ని అదిమిపెట్టి బాధవిముక్తి పొంది బైటపడిన భక్తిలో కొంతసేపు నిలిచాడు.

లక్ష్మి నైవేద్యం పెట్టిన సెనగలదోయిలితో కళ్లమూసుకొని శివునికి శ్లోకార్చన చేస్తూన్న వెంకట్రావు ఎదుట నిలిచింది. పెట్టిన విభూతి పెండికట్టు, నొసటను కొసరివెలిగే కుంకుమబొట్టు ధ్యానాసక్తిలో వేసిన పద్మాసనం చూచి సాకారిణియైన శివుడే అనుకున్నది. నిశ్శంకతో, సమధికోత్సాహంతో, కృశాంగియై వెంకట్రావును "స్వామీ! చేయి పట్టుడు" అనిపిల్చింది. వెంకట్రావు ధ్యాననిమగ్నతలో ప్రియారూపం దృక్గతమై ఉండగా అవశుడై ఉన్నాడు. ఆమెమాటలు వీనుల చేరగానే ప్రియారూపభావనాప్రమత్తతలో దోసిలి పట్టి, ఆమె దోయిలిని, సెనగలను అట్టులే పట్టుకొని నిలిచిపోయినాడు.

ఆలయం వెనుక భాగాన సౌదామని చమక్‌మని చూసింది. ప్రావృట్ మేఘుడు ఆమె దృక్సందేశమును పోల్చుకొని శంఖం పూరించాడు "భక్తిపారవశ్యంలో ప్రేమకు ప్రతిఫలంవుందని". ఈసందేశమునే వరుణుడు తన సహస్రధారాకలిత వర్షధారాతంత్రుల వీణెయపై మీటినాడు. శివదర్శనానికి వస్తూండే అర్చకుల అడుగుసందిళ్లలో కరిగిపోయింది ఆ అతిలోక దృశ్యం.

# తెరచాటు కళ

మద్దాలి సూర్యప్రకాశరావు

"The particulars first, and then the generalization, is the new method. . . . . . Rule-teaching is now condemned as imparting a merely emperical knowledge -- as producing an appearance of understanding without the reality. To give the net product of inquiry that leeds to it is found to be both enerveting and inefficient. General truths to be of due and permanent use must be earned."

— Education by Edmend Spencer

గతించిన శతాబ్దంలో యెండి మోడైపోయిన భారతభూమి యిప్పుడు తిరిగి చిగురుస్తోంది; మొగ్గలు తొడగబోతోంది. ఈ దేశాన్ని ఒక నూతన జీవశక్తి ఆవరించినట్లు తోస్తుంది. సజీవంగావుండే దేశంలో లలితకళలు ఉన్నతదశలో వుంటాయి. అవి భారతదేశంలో తిరిగి జన్మించాయి. వృద్ధి పొందుతున్నాయి.

అట్లు అభివృద్ధి పొందుతున్న కళలలో చిత్రకళ వకటి. ఈ రోజున మనదేశంలో చాలామంది చిత్రకారులున్నారు. చక్కని బొమ్మలు వ్రాస్తున్నారు. కాని యిట్టి చిత్రకారులుగాని, వారిబొమ్మలు అర్థము చేసుకొని, జ్ఞానము పొంది ఆనందాన్ని అనుభవించేవారుగాని వేయి కొక్కరయినా లేరు. ఇది విచారకరమైన విషయం.

పరబ్రహ్మస్వరూపాన్ని తెలుసుకొనడానికి చిత్రకళ సూక్ష్మమార్గాన్ని చూపిస్తుంది అన్నాడు అక్బరుసార్వభౌముడు. అది అట్లుంచి చిత్రకళ నభ్యసించిన తర్వాత, లేక ఆకళాజ్ఞానాన్ని సంపాదించిన తర్వాత మనకు వక కొత్త చూపు, ఒక కొత్త ఆనందము కలుగుతాయి అనేమాట నిశ్చయం.

ఇటువంటి కళ యీ దేశంలో, ముఖ్యంగా ఆంధ్రదేశంలో అంటరానిదై పోయింది. స్కూళ్ళలోగాని, కళాశాలలోగాని దీనిని గురించి

చెప్పరు. జనసామాన్యానికి సులభంగా బోధపడేటట్టు వ్రాశిన పుస్తకాలు అసలే లేవు. ఈ కారణంచేత నేను ఈ "వీణ" పత్రికను ఆధారము చేసుకుని వ్యాసరూపంలో, తేటమాటల్లో సామాన్యులకు గూడా బోధపడేటట్లు యీకళను గురించి ఆమూలాగ్రంగా వ్రాయాలని సంకల్పించాను.

ఇది సాహసమయిన పని. అయినా దీనికి యెవరో వకరు, యెప్పుడో వకప్పుడు పూనుకొని చేయకతప్పదు. ప్రథమ ప్రయత్నంలో తప్పులు చేయడంకూడా సహజమే. కాని యీ వ్యాసాలు యిక ముందెవరైనా సమర్థులు ఈకళను గురించి వ్రాయడానికి పూనుకున్నప్పుడు వారికి సహాయం చేస్తాయనీ, యీలోపుగా సామాన్యులయిన వారికి చిత్రకళయందు రుచిపుట్టించుతాయనీ నా ఆశ.

ఏదైన వక కొత్త శాస్త్రాన్ని అందరికీ సులభంగా వుండేటట్లు బోధ చెయ్యాలంటే ముఖ్యంగా మూడువిషయములు గమనించాలి.

౧. ఆశాస్త్రమునకు సంబంధించిన వింతయైన, రుచికరమయిన, ఆకర్షణీయమయిన సంగతులు ముందు చెప్పి చదువరులను మచ్చిక చేసుకోవాలి.

౨. ఆశాస్త్రముయొక్క ధోరణి అంతా సరిగా అర్థం కావడానికి తప్పుడర్థాలు దొరలకుండా వుండడానికీ పారిభాషిక పదాల్ని, సంపాదించాలి.

3. ఆఖరున ఆశాస్త్రంయొక్క మూలసూత్రాల్నీ, దాని వ్యాఖ్యానాలిని, అంతరార్థాల్నీ విపులంగా తెలపాలి.

ఈ మయువిషయాల్నీ మనస్సులో వుంచుకొని నేను యీ వ్యాసంలో కారణజన్ములైన కొందరు పురాతన చిత్రకారుల జీవితాల యందలి రసవంతమైన ఘట్టాల్ని వ్రాస్తున్నాను. మిత్రలాభము, మిత్రభేదము బోధించేటప్పుడు విష్ణుశర్మ అవలంబించిన మార్గము ఆదర్శనీయమయింది. నేనుకూడా కొద్దిమార్పులతో దాన్నే అనుసరిస్తున్నాను.

యవనదేశము ( గ్రీస్ ) పాశ్చాత్యులకు ఆదర్శ భూమి. వారి దృష్టిలో అది కళలకు పుట్టిల్లు. క్రీ॥ పూ॥ 5వ శతాబ్దము నాటికే యవనులు లలిత కళలలో వారితో సమానులు లేరనిపించు కొన్నారు. వారి కళాదృష్టిలో అసాధారణమైన సంపూర్ణత, శోభ, తేజస్సు ఉన్నాయి. సూర్యచంద్రులు వెలుగునంత వరకు యవన కళ దివ్యకళగా చూడబడుతుంది. కళాపిపాసువులకు యవనులు అమరత్వము పొందిన మానవులు.

ప్రత్యేకించి శిలాప్రతిమలు చేయడంలోను ( Sculpture ), బొమ్మలు వ్రాయడంలోను యవనులు ఆరితేరారు. ప్రతిమలు నాశనం లేని రాతితో చేయబడడం చేత నేటికి నిల్చాయి, బొమ్మలు సులభముగా నాశనమైపోయే గోడలమీద వేయ బడడంచేత అవి చాలా వరకు మట్టిలో కలసిపోయాయి. కాని పానపాత్రలమీదా, పూల కుండీల మీదా, కూజాలమీదా గీసినబొమ్మలు నేటికీ దొరుకుతున్నాయి. యవన చిత్రకళాపాండిత్యము రుచిచూడాలంటే వీటినిచూస్తే చాలు.

* * * *

యవనుల నాటి ప్రపంచము నిండుయౌవనంలో వుంది. ఈ యౌవన సౌభాగ్యాన్ని రెండు చేతులా అనుభవించారు యవనులు. వారి జీవితము ప్రతి క్షణమందు శౌర్యము, విజ్ఞానము, సౌందర్యపిపాస, వాక్చాతుర్యము, మనో స్వాతంత్ర్యము, కోమలత్వము- వీటినే కోరింది. ఆ కారణంచేత ప్రతి యవనుడు వేదాంతి గానీ, కవి గానీ, వక్త గానీ, శిల్పి గాని — తప్పనిసరిగా యుద్ధవీరుడు కావాలిసి వచ్చింది.

అందమే యవనుల దైవము. దాన్నే పూజించారు, ఆస్వాదించారు. నిత్యజీవితమందు ప్రతి చిన్నవిషయంలోనూ సౌందర్యమే లక్ష్యంగా పెట్టుకొన్నారు. ఇలాంటి యవనులచిత్రకళ జీవకళతో తొణికిసలాడుతోందంటే ఆశ్చర్య మేముంది? ౨౦౦ ఏండ్లలోగా అది పుట్టి, పెరిగి, పూచి సువాసనలను ప్రపంచంలో అంతటా అనంతంగా విరజిమ్మింది.

యవన చిత్రకళ పుట్టుక గురించి చక్కటి కథలున్నాయి. ఐరోపా ఖండానికి ఆగ్నేయమూల యవనులు ఏథెన్సు, స్పార్టా, థీబ్సు మొదలగు బుల్లిబుల్లి రాజ్యాలు స్థాపించారు. వీటి స్వాతంత్ర్యము కాపాడుకోడానికి ప్రతియవనయువకుడు రోజుకి అర గంటలు కవచముదాల్చి కత్తి పట్టవలసిన రోజులు వచ్చాయి. ఆ రోజులలో పుట్టిందట యవన చిత్రకళ.

* * * *

యుద్ధం ప్రారంభమయింది. తయారై బయలుదేరాడు ఒక యవన యువకుడు. తను ప్రేమించిన చిన్నదానిని చూడడానికి ముందు వచ్చాడు. ఆ అమ్మాయి కుమ్మరిది. తండ్రిచేసిన కుండలకీ, కూజాలకీ మెరుగుపెట్టేది. వాట్లమీద రంగులతో అలంకారాలు దిద్దేది. ఇపుడు ఆ నేర్పు పనికివచ్చింది. ప్రియుణ్ణి గోడదగ్గరకు తీసుకువెళ్ళి, అక్కడ అతనిని నిలువబెట్టి దీపంవకటి పక్కనపెట్టింది. అతనినీడ స్పష్టంగా, స్ఫుటంగా గోడమీద పడింది. ఆనీడ అంచువెంబడే నేర్పుతో బొగ్గుముక్కతో గీసుకువచ్చింది. ప్రియుడు వెళ్లిపోయిన తర్వాత ఆ చుట్టు గీత మధ్యను చిక్కటి జేగురు పూసింది. ఈ విధంగా ఆ అమ్మాయి అప్రయత్నంగా తయారుచేసింది ప్రథమయవనయేకవర్ణభిత్తిచిత్రము.

* * * *

జరుగుతూయున్న యుద్ధంలో కొంచెం ఖాళీచిక్కింది. కత్తి, డాలు క్రిందపెట్టి యవనసైనికులు క్రింద సాగిల బడ్డారు. వారికి ఉబుసు పోవటం లేదు. ఎండ తీవ్రంగా కాస్తోంది. ఒక యువకుడు తనగుఱ్ఱంకేసి చూస్తూ కూర్చున్నాడు. అలా చూస్తోంటే ఆ గుఱ్ఱపునీడ చక్కగా దిద్దితీర్చినట్టు భూమిమీద పడివుండడం కనిపించింది. అతనికేదో తోచింది. వెంటనే లేచి తనదగ్గరనున్న ఎఱ్ఱమట్టి కొంచెం తెచ్చి పాకి చేసి ఆనీడ అంచువెంబడే తిన్నగా పోశాడు. ఈలోగా రణదుందుభి

మ్రోగిన సంగతి అతనికి తోచలేదు. తక్కిన సోదరులంతా యుద్ధసన్నద్ధులైనది ఆతను చూడలేదు. దూరాన్నుంచి చూచాడు అతన్ని సైన్యాధికారి. చర్రున వచ్చి అతన్ని గద్దించి లేపాడు. ప్రమత్తతకు అతన్ని శిక్షకు సిద్ధపడ మన్నాడు. ఒక్కసారి తనుగీసిన బొమ్మచూసుకొని తల వంచాడు యవన సైనికుడు. అధికారి కూడ ఆబొమ్మకేసి అప్రయత్నంగా చూసి నివ్వెరపోయాడు. తనెన్నడు కనివినియెరుగని సంగతి ఆబొమ్మ. యువకుని చూసి " నీవు రణరంగంమీద కాను కీర్తి గడించవలసింది. ఇంటికి మరలిపో; ఇలాంటివి వేలకొద్దిగీయి. అదే నీపరమార్థం. ఇదే నేవిధించిన శిక్ష నీకు" అన్నాడు అధికారి.

* * * *

ఈ పయి రెండు చిన్న కథలు చక్కనివే. ఆకుమ్మరి చిన్నది గాని ఈ సైనికుడు గాని మొదటి యవన చిత్రాన్ని వ్రాసినట్టు గర్వించవచ్చు. కాని వాస్తవంగా యీరీతిగానే బయలుదేరింది అనుకోవడం పొరపాటు. ఇల్లాఅకస్మాత్తుగా యేదేశపు కళా యెన్నడూ బయలు దేరలేదు.

యవనులలో చిత్రకళాచార్యులు ౪వ శతాబ్దం నాటికి చాలామంది ఉండేవారు. ఈ కళా విశారదుల కాదిపురుషుడు పోలిగ్నోటస్.

ఆనాటికి యవనులు బొమ్మలు గీయడంలో వాడిన పద్ధతులన్ని పోలిగ్నోటస్ కృషిచేసి, నేర్చి అసాధారణమైన ప్రజ్ఞ గడించాడు. ఆ పద్ధతులలో మూడు ముఖ్యములైనవి.

౧. మోనోక్రోమ్: ఏకవర్ణచిత్రము. చుట్టు గీతగీసి మధ్య ఒకటే రంగుపూసిన బొమ్మ.

౨. మోనోగ్రామ్: బొమ్మఅంతా గీతలతో నిర్మించి ఒకటేరంగు అంతటా పూసినబొమ్మ.

3. పోలిక్రోమ్: వివిధ వర్ణచిత్రము. బొమ్మ అంతా గీతలలోనే

నిశ్శించి యెక్కడ పూయవలసిన రంగు అక్కడ పూసిన బొమ్మ.

ఈ మూడువిధములుగాను పోలిగ్నోటస్ సవ్యసాచిలా పనిచేశాడు. థసాస్ అనే ద్వీపంలో పుట్టి, క్రీ॥ పూ॥ ౪౬౩లో ఏథెన్సు నగరములో మకాం ఏర్పరచుకొన్నాడు. అతను తమకుచేసిన కళాసేవకు మెచ్చి ఎథీనియనులు ఆతనిని తమ పురపౌరుడుగా యెన్నుకున్నారు. హోమరు అనే కవి యవనుల వాల్మీకి. ఆయన ఇలియడ్, ఒడెస్సీ అనే రెండు మహాకావ్యాలు వ్రాశాడు. ఈ గ్రంథములలోనే రసవంతములయిన సందర్భములను యెత్తి బొమ్మలుగా వ్రాశాడు పోలిగ్నోటస్. డెల్ఫీ అనే పట్టణంలో ఎపోలో అనే దేవుడిగుడిలో గోడలమీదవేశాడు ఆ బొమ్మల్ని. వీటిలో అత్యుత్తమమయినవి "ఎజాక్సశిక్ష" "కెసాండ్రా మానభంగము" అనేవి. ౬౦౦ ఏండ్లు తరువాత వాటిని చూచి పాసేనియాస్ అనే కళావిమర్శకుడు ముక్కునవ్రేలు వేసుకున్నాడు. వాటిని పోలిగ్నోటస్ యొక్క ఇలియడ్, ఒడెస్సీలు అన్నాడు. దానితో వందలకొద్దీ చిత్రకారులు వాటికి ప్రతులను గీశారు గోడలమీదా, కుండలమీదా, పాత్రలమీదా ......

ఎరిస్టోటిల్ యవన వేదాంతులలోనూ, విమర్శకులలోనూ, అగ్రగణ్యుడు. అపర శంకరుడు. ఈయన చిత్రకళావిమర్శలో ఈ క్రింది చక్కని వాక్యము వ్రాశాడు.

"పోలిగ్నోటస్ మనుష్యులను మానవాతీతులుగను, పాసన్ మానవాధములుగను, డైయనీస్యస్ సాధారణులుగను చిత్రించారు. మన కవిత్వంలో వాల్మీకికి యే స్థానమున్నదో ఆస్థానమే మన చిత్రకళలో పోలిగ్నోటస్‌కు వున్నది." (సశేషం)



# స మీ క్ష

సుం ద రి:— ప్రభాతకుమార ముఖర్జీగారి బంగాళీనవలకు శ్రీ శివ శంకరశాస్త్రిగారి అనువాదం. క్రౌను సైజు ౨౩౬ పుటలు. వెల ఒక రూపాయి, దొరికేచోటు: ఆంధ్రరత్న గ్రంధమాల, చీరాల, గుంటూరు జిల్లా.

శాస్త్రి గారు కుంకుమభరణి తీసుకొని ప్రభాతకుమారుని ప్రతిభను మనకు చూపెట్టారు. ఈ సారి సుందరితో మనకు పరిచయాన్ని కల్పిస్తున్నారు.

ఇది వక సంసారిక నవల. మొదలెట్టడమే తరువాయి. తరువాత మనంకూడా సుందరవనములను చూడడానికివెళ్లి కథ ఆసాంతం వారితోనే తిరిగి ఆఖరికి యింటిదగ్గరే వున్నట్టు తెలుసుకొంటాము. స్థల వర్ణనలు యెంతపెంచివ్రాసినా, మనోహరంగా యేమాత్రం విసుగు పుట్టించకుండా వున్నాయి. సాధారణంగా మన తెలుగు నవలలో అనువాదాలను మినహాయిస్తే చెప్పుకోతగ్గ స్వతంత్రనవలలు యే కొద్దిగానో మిగులుతాయి. ఈ నవలను చదివినతరువాత యిటువంటి నవలలు యింకా కొంతకాలం వరకూ ఇతర భాషల్లోనుంచి తెచ్చుకోక తప్పదేమోనని అనిపిస్తుంది.

మానవ స్వభావాల్ని గుర్తించడంలో లేఖకుడు ఆరితేరిన చేయి.

“కేవలం అసంభవమని మనిషి ఏది మనస్సులోకి కూడా రానియ్యలేడో అదే మరొకరు దృఢంగా నచ్చచెబితే ఎందుకు కాదంటారు, మొదట కొంచం ఉలికిపడతాడు. ఆ ప్రస్తావన స్వార్ధానికి బాగా అనుకూలించేదయితే అనుకూలమయిన యుక్తులే అతని మనస్సులోకి తేనె యీగల లాగు పోగవుతవి. తర్వాత అతని పూర్వ విశ్వాసములో మార్పు కలుగుతుంది.” ౧౧ పుట

“ఇరవైయేండ్ల వయసున పనులు చేసేటప్పుడు ఎవరూ ముందు వెనుకలు ఆలోచించరు” ౮౪ పుట

"ప్రత్యాశ లేనటువంటి, అపరచిత మైనటువంటి, ఆకర్షణ పిన్నవయస్సులో ఉన్నవాళ్లకు ప్రబలంగా ఉంటుంది" ౧౭౯ పుట.

పట్టశక్యంగాని' స్వభావంగల చేపలు పట్టే, చెట్లెక్కే, ఈతగొట్టే, విల్లుపట్టే సుందరి పిట్టలుపెంచే మోజుగల గోపాలుడిని ఆకర్షించిది. చేత పైసాలేనివాడి కూతురు సుందరి. కుమారరాజా గోపాలుడు, ఇంకో యెస్టేటును వెంట బెట్టుకుని వచ్చే సూర్యపురం రాజాగారి సంబాధం కాళ్లతన్నివేశాడు. తన తండ్రి యెస్టేటుకు తిలోదకాలు యిచ్చాడు. పంజాబు పారిపోయి సుందరిని పెళ్లిచేసుకొన్నాడు. తను యేచంచల స్వైరవిహారధీరను చూచి మెచ్చుకొన్నాడో ఆమే ఇప్పుడు తనకు బీబీ అయింది. ఆమెయందున్న కులాసా కాస్తా అంతరించిన సంగతి మన బాబు గుర్తించాడా? ఇదీప్రశ్న. తరువాత లోకులు చెప్పుకునే సుఖాలు ధనమూ, కీర్తి, సంతానము అన్నీ వున్నాయనుకోండి. ఎగిరే తంగురంగుల చిలకను చూచి ఆనందిస్తాము. దాన్ని పట్టుకొని పంజరములో పెడతాము. మరి చిలకకో?

చురకలు అంటించడంలో ఘనుడు.

"ఈ రోజులలో యుద్ధంలో గెలవడమంటే గవర్నమెంటు ఉద్యోగము దొరకడముగాని, దావాలో గెలిచి రానడముగాని, యూనివర్సిటీ పరీక్షలో ప్యాసు కావడముగాని, అని తేలింది."

౫౮ పుట.

ఇంతబాగున్నప్పటికీ అనుకోని కొన్ని తప్పులుదొర్లాయి.

"ఆషాఢ త్రయోదశి విశాఖా నక్షత్రము." పుట ౧౫౫

యే త్రయోదశి అయినది చెప్పలేను. యేది అయినా ఆనాడు విశాఖ మటుకు రాదు.

నవలా ప్రియులందరు సుందరిని చేరదీయాలని నా యాశ్పితం.

"రాజశ్రీ"

పద్మావతీ చరణ చారణ చక్రవర్తి : కర్త, శ్రీ శివశంకరశాస్త్రి
నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరు

ఇది ఒక పద్యనాటిక. శ్రీ గీతగోవింద కృతిసమర్పణం దీన్లో ముఖ్య విషయం. ఆనుషంగికంగా పద్మావతీజయదేవుల పవిత్రప్రణయమూ, గౌడభూపతి సభావైభవమూ ఇంకా యింకా యెన్నో వస్తువి. ఒకటీ అనవసరంగా వచ్చినట్లు వుండదు. ఈ చిన్న కావ్యాన్ని సంధులు కొడ గొట్టి ప్రత్యంగపరీక్ష చెయ్యడం విరసంగా వుంటుందేమో!...

శాస్త్రిగారి సంభాషణ చాతుర్యం ఎరిగినవారు నిజంగా ఈ కావ్యము నందలి సంభాషణసౌలభ్యం ప్రత్యేకం ఆయన సొమ్మే అనుకుంటారు. కవిత్వాన్ని గురించి శాస్త్రిగారు థియరిటికల్‌గా చెప్పిందే ప్రాక్టీసు చేస్తారు. కవిత్వానికి డైరెక్టు ఎప్పీల్ వుండాలని వారి వాదం. సంగీతంలాగ కవిత్వం అశ్రమ-ఆస్వాదనీయం కావాలి. కవిత్వంలో కాటిల్యం పనికిరాదు. ఈ కవితలో ఇది అక్షరాలా నిజం.

శాస్త్రిగారు స్త్రీ పక్షపాతి. అది ఈ కావ్యం నిండా వుంది.

"నిజముగా నీనాడు నీకె జయంబు"

అన్న జయదేవుల వాక్యం సత్యం. ఈ కావ్యంతో ప్రత్యక్షసంబంధం అంతగా లేకపోయినా కావ్యధోరణి అంతా పద్మావతి వేపుకే విసురుతూ వుంటుంది. కావ్యాంతమందు శ్రీగీతగోవిందం ఆశ్రయమాత్రముగా మన హృదయాల్లో శాశ్వతంగా నిలిచేవి పద్మావతి సౌందర్యమూ, సంగీతమూ, నృత్యమూ—

ప్రేమతప్ప శాస్త్రిగారి కవిత్వానికి వేరే విషయం లేదు. ఈర్ష్య, క్రోధం, ద్వేషం— ఇత్యాది కటుభావాలు ఆయన్ని చేరలేవు. ఈభావాలకి ప్రాధాన్యం ఇచ్చే కావ్యం ఏదన్నా వ్రాస్తే చదవాలని వుంది. బహుశా రసాభాసం కాక తప్పదు.

శాస్త్రిగారి కృతుల్లో ఇది అత్యుత్తమం. ముత్యాలసరం ఇంత సుఖం

గా నెవరు నడపగలరు? ప్రవాహం— అలా అలా లాక్కుపోతుంది. ఈ కావ్యంలోని చమత్కారం ఎడనెడ లోకోత్తరమై బ్రహ్మానందం కలిగిస్తోంది. పద్మావతి భవ్యమూర్తి, మధురగానం, మనోహరనృత్యం మనకు చిరకాలం నిల్చుగాక!

వెల: 0-9 0 నవ్యసాహిత్యపరిషత్తు, గుంటూరు

"పా"

---

భారతీయ కార్మికోద్యమ చరిత్ర: కర్త, తుమ్మల వేంకటరామయ్య

భారత దేశంలో 1918 మొదలు నేటివరకూ జరిగిన కార్మికోద్యమం జన్మ, వృద్ధి, క్షయాలూ, విజృంభణలూ ఈ గ్రంథంలో వివరముగా వర్ణించబడివున్నవి. రచయిత ప్రపంచంలో కార్మికోద్యమాల్ని ప్రత్యేకాభిమానంతో పరిశీలించినవాడు. ఈ నడుమ కొన్నాళ్లు 'కౌముది' అనే పత్రికను నడిపినాడు. యువకులలో మంచి ఉత్సాహం, ఉద్రేకం కల సంస్కారి. సంస్కర్త. ముఖ్యంగా ఈ రోజుల్లో ఈ గ్రంథానికి ఎంతో ప్రాధాన్యం, విలువ ఉన్నవి.

"పా"

---

కదంబము (పద్యకావ్యసంపుటి): రచయితలు, కవిమిత్రులు

నవ్యసాహిత్య పరిషత్తు, గుంటూరు

ఇది నవ్యసాహిత్య పరిషత్తు ప్రథమప్రచురణం. దేశోద్ధారకునికి అంకితం. దీంతో పంతులుగారు పరిషత్తుకు ముడిబడ్డారు.

కావ్యాలన్నీ ఉత్సాహాన్ని, భవిష్యత్తులో ఆశని వెల్లడిస్తున్నవి. చిరంజీవులు కాశిరాజు రామమోహన శర్మ, కొండేపూడి సుబ్బారావు, బాలాంత్రపు రజనీకాంతరావు, తల్లావఝ్ఝల కృత్తివాసతీర్థులు ఈ సంపుటిలో వ్రాశారు. ఈ వర్ధిష్ణువులు ఆంధ్రులకు ఆదరపాత్రులు.

"పా"

# శాస్త్రిగారి లేఖలు

## ౧

మహాదేవాశ్రమము

తెనాలి, ౨౯. ౧౦. ౧౯౧౬

*వఝ్ఝ బాబురావుకు,

మామా, నీవు ౨౬ తారీఖున వ్రాసిన వుత్తరం వచ్చింది. ఇంతకు పూర్వం అగోచరంగా ఉన్నసంగతులు ఇప్పుడు స్పష్టమైనవి. దీపావళినాటికి ‡హనుమంతరావుకూ నాకూ పంపిన చిత్తరువులు చూచి మేము సంతోషిస్తూఉంటే మా నీతిబోధ అనేమంచు మోతాదులు బలవంతంగా మింగి నీవు చాలా బాధపడుతూ ఉంటావని భావించడంచేత నాకూ విచారంకలిగింది. మీ యింటినుంచి వచ్చిన ఉత్తరంవల్ల వికలమైన మనస్సుకు నా మాటలు ఔషధప్రాయంగా ఉపకరిస్తవనే ఊహతో నీకలా వ్రాశాను. స్వభావతః వివేకవంతులైన వాళ్లకు కష్టంమీద కష్టం వచ్చినప్పుడు 'మహామహీధ్ర సంఘాతకర్కశం' బవుతుందికదా మనస్సు!

నామనస్సు కొంత గ్రహించి ఉంటావు. ఒంట్లో అట్టేబాగాలేదు. నిరంతరం గ్రంథపఠనంచేత కళ్లు మంటలెత్తుతున్నవి. బొంబాయి రావలెననే కోరిక కొరడావలెఉంటే దాన్ని లొంగదీసే పనులు తారసిల్లుతున్నవి. ఎక్కడకీ వెళ్లవద్దని ఇంట్లోపోరు! చాలా వరకు మహాదేవాశ్రమమే శరణముయింది.

---

* సర్. జె. జె. ఆర్టుస్కూలు, బొంబాయిలో చిత్రకళ అభ్యసిస్తూవుండేవాడు.

‡ కొమ్మూరి హనుమంతరావు కథకుడు, సాహితీసమితి స్థాపకుల్లో ఒకడు.

నీవు గడబిడగా వ్రాసినఉత్తరం చదివినప్పుడు మొదట విచారం కలిగింది. తర్వాత కోపంవచ్చింది. మూడు రోజులు అన్నం సయించలేదు. వ్రాసేదిబాగా వ్రాయగూడదా అని హనుమంతరావూ నేనూ తర్కించాము. మనస్సు పరిపరి విధాల పోయింది. ఏమీ నిర్ధారణ కాలేదు. చివరికి మూర్తికి వ్రాశాను — నీ సంగతి కనుక్కొని నాకు తెలియ జెయ్యవలశిందని, అతని జవాబు రానేలేదు.

నీవిషయమైన దిగులే కాకుండా మా అన్నగారు, ఆయన కుమారుడు, ఇంకో మిత్రుడు మొదలైనవాళ్లను గురించిన దిగులుకూడా వేస్తున్నది. పైగా మాబావ నేతి నరసింహశాస్త్రి ఒంగోలులో మరణించినట్టు ఉత్తరం వచ్చింది. నిజంగా నాకు పరీక్షాసమయం! నీకు ఎన్నో సంగతులు వ్రాతామనుకొన్నా, ఓపికలేక వ్రాయలేను.

నీ ఉత్తరాలను బట్టిచూస్తే నీవు గ్రంథకర్త వవుతావనే నమ్మకం కలుగు తున్నది. ప్రతివాడూ కవిత్వంచెప్పాలి, చిత్తరువులు వ్రాయాలి అని రాసేటీ చెప్పిన సూక్తి చాలాబాగున్నది.

ఇప్పుడునేను Dante Rosetti విషయం చదువుతున్నాను. ఇతన్ని గురించి ముందుముందు వ్రాస్తాను.

ప్రస్తుతం నీవు టెక్నిక్ నేర్చుకో. తక్కిన ఆలోచన తర్వాత చెయ్యవచ్చు. సంవత్సరం అయినతర్వాత అవనీంద్రనాథ ఠాకూరు దగ్గర ఉండడం మంచిది. తొందరలేదు.

ఒకడు నీతో మాట్లాడితే ఏమి, మాట్లాడకపోతే ఏమి? మౌనము వహించు. ఆస్ట్రోజర్మన్ నాటకకర్త హెబ్బెల్‌కు స్నేహితులే లేరట ఎవరితోనూ అతను పదిమాటలాడి ఎరగడు. అతనికి కాలం గడవలేదా?

ఎవరైనా నిన్ను పలకరిస్తే యథోచితంగా మాట్లాడు. ముందుగా నీవు జోరెత్తకు. ఒకడితో నీకెందుకు? ధీరుడు సామాన్యంగా ఒంటరిగానే ఉంటాడు.

ఖలుడు స్థిరుడా అస్థిరుడా అనే ప్రశ్నవచ్చింది. స్థిరుడే అనుకుంటే వాడితో స్నేహం గడియకూడా లేదు. అస్థిరు డనుకొనే టప్పటికి వాడికోపం యుగాంతంవరకూ నిలిచిందట.

ఎప్పుడూ ఉల్లాసంగా ఉండు 'ఆనందోహం' అని భావనచేస్తే మనస్సులో కల్లోలం ఉండదు; నిశ్చయంగా సుఖం కలుగుతుంది.

నీకు తెలియదనికాని, నాకు లోపాలు లేవనికాని ఎంచి 'నీతిచంద్రిక' వ్రాస్తున్నా ననుకోబోకు. నా స్వభావం నీకు తెలియంది కాదు.

*కృత్తివాసు నిన్ను మరిచి పోతున్నాడు; నీపేరు చెప్పినా మళ్ళీ అనడం మానేశాడు. ఎప్పుడూ చిన్నిచిన్ని పాటలు పాడుతూ ఉంటాడు వీడికి సంగీతం వస్తుందేమో.

**Literature, Art and Music** ఉంటవికావోలు మాయింట్లో! తండ్రికి **Literature and Art**; కొడుక్కు **Music and Art!** ఇంకా కొదవ యేమిటి!

భవదీయః

' శి '

---

* శాస్త్రిగారి కుమారుడు.

శ్రీ శివశంకర శాస్త్రి గారు సాహితీసమితి నిర్మాతలలో ముఖ్యులు. వీరు వ్రాసిన ఆనాటి లేఖల వలన వీరి జీవితోద్దేశము వెల్లడియగును. క్రమక్రమముగా ప్రకటింప నుద్దేశించాము.

సం॥ వీణ.

# మాక్సిమ్ గార్కీ

18 జూన్ 1936న మాస్కో నగర సమీపంలో ఉన్న గార్కీలో మాక్సిమ్ గార్కీ తన 69 వ ఏట దివంగతుడైనాడు. ఐదు లక్షల మంది ప్రజలు చివరసారి ఆయన శవదర్శనానికి వెళ్లారు. ఏడులక్షల మంది శవంవెంట దహనభూమికి నడిచారు. రాజ్యకార్య ప్రసక్తులందరూ హాజరైనారు. ఆయన గౌరవార్థం ఫిరంగులు పేల్చారు. ఫ్రాన్సు, జెకోస్లొవోకియా ప్రభుత్వాలవారు పుష్పదామాలు పంపించారు. ప్రపంచంలో పత్రికలన్నీ ఆయన్ని ఏకగ్రీవంగా ప్రశంసించినవి.

మాస్కో, లెనిన్‌గ్రాడ్, నెజ్నీనోవగరాడ్ నగరాలలో ఆయనస్మృతి చిహ్నాలు నెలకొల్పడానికి నిశ్చయించారు. జెకోస్లొవోకియా రాజధానిలో ఒకానొక రాజమార్గానికి ఈయన పేరుపెట్టారు. జగద్విఖ్యాతులైన రొమేఁ రోలాఁ, వెల్సు, మొదలైనవారు ప్రశంసా పూర్వకమైన తంతి వార్తలు మాస్కోకు పంపారు.

ఇంత మహాగౌరవం జరగడానికి ఏమిటి కారణం? చాలా బీదకుటుంబంలో పుట్టి జీవనార్థం అనేక చిన్నచిన్న వృత్తులు అవలంబించి, మహా కష్టాలుపడి, క్రమేణ పత్రికలకు కథలు వ్రాసి, నవలలు రచించి, అఖండ విఖ్యాతి గడించాడు గార్కీ. ప్రపంచంలో కొంతమంది మహాపురుషుల అసలుపేర్లు అనుగంటి అవలంబించిన నామాలు ప్రచారంలోకి వచ్చినవి. అలెగ్జిస్ మాక్సిమ్ పెష్కావ్ అసలుపేరు. గార్కీ అనేది " తఖల్లూస్ "

గార్కీ జీవితమంతా జగత్కళ్యాణం కోసం వినియోగపడ్డది. ధనవంతులు, సామ్రాజ్య వాదులు, నిరంకుశ వాదులు మొదలైనవారిని ప్రతిఘటిస్తూ అన్నార్తులను దీనులను ఉద్ధరించడానికి గ్రంథాలు వ్రాశాడు. యుద్ధ నివారణకై మహాప్రయత్నాలు చేశాడు. నాగరకత నిలపడానికి పాటు పడ్డాడు.

The Lower Depths
Mother
Letopis
Child hood
Chel kash

మొదలైన గ్రంధాలు చేశాడు. ఇందులో Mother అనేది మన తెలుగులోకూడా పరివర్తన పొందింది. ఈ గ్రంధాలన్నింటిలోను సామ్రాజ్యవాద నిరసనమూ, జనసామాన్య ప్రభుత్వ ప్రచారమూ ప్రధానంగా వుంటవి ఆయనకు హిందువుల మీద చాలా ఆదరం వుండేది.

ఇటువంటి లోకోత్తర పురుషుని ప్రపంచం మరిచి పోదు. మాస్కోలో నిర్మించబోయే ఈయన బాహ్యస్మృతిచిహ్నం కాక ప్రజాసామాన్యం హృదయంలో ఈయన స్మృతి శాశ్వతంగా వుంటుది.

Edited, Printed and Published by P. Madhava Sarma,
at Usha Press, Telaprolu, Kistna